# ప్రశంసాభినందనలు

'రాములమ్మ పదాలు, నానీల' జత పొత్తము మా (అ)పూర్వ విద్యార్థి చి॥ నర్సింహా రెడ్డి ఆత్మాశ్రయ కవితా సంకలనం. డైట్, నేరెడ్ మెట్ కళాశాలలో ఉపాధ్యాయ శిక్షణార్థిగా ఉన్న రోజుల్లో అనేక సందర్భాలు, సమావేశాలలో ఆశువుగా రాసి పఠించిన కవితలు అధ్యాపకుల, సహ ఛాత్రోపాధ్యాయుల మన్ననలు పొంది ఉన్నాయి.

కొంత కాలంగా వివిధ సంఘటనలు, అనుభవాలు, స్పందనలు, ఆలోచనలు, ఆవేదనలు, ఆక్రోశాలతో కూడిన సహజ సిద్ధమైన తన యవ్వన దశ లక్షణాల ప్రతిబింబాలే ఈయన కవితలు.

సైకాలజీ ప్రకారం వ్యక్తులు, అంతర్వర్తనులు (Introverts) మరియు బహిర్వర్తనులు (Extroverts) అని రెండు రకాల మూర్తిమత్వాన్ని కల్గి ఉంటారని మనందరికీ తెలిసిందే. మరీ ముఖ్యంగా ఈయన మొదటి కోవకు చెందిన వాడుగా తోస్తుంది. నిశ్శబ్ద సముద్రం లాంటి ఇతన్ని ఎప్పుడు, ఏ తుఫాను ఎలాంటి ప్రభావానికి గురిచేస్తుందోనని అందరూ భావించేవారు.

మహాకవి ఆరుద్ర గారి "కూనలమ్మ పదాల" ప్రేరణతో ఆ ఛాయలో 'రాములమ్మ పదాలు' రచించాడు. నానీల ఆయువుపట్టెరిగి తనదైన ముద్రతో 'నానీల'ను వెలువరించాడు.

వస్తువైవిధ్య భరితాలు సమకాలీన సామాజిక, ఆర్థిక, రాజకీయ, విద్యాసంబంధిత అంశాలపై తన అస్త్రాలను సూటిగాను, నర్మగర్భంగాను ఎక్కుపెట్టాడు.

శబ్దాలంకారాల్లో అనుప్రాస, యమకం; అర్థాలంకారాల్లో ఉపమా, అతిశయోక్తి, దృష్టాంత, రూపక, స్వభావోక్త్యలంకారాల సముచిత ప్రయోగాన్ని వీరి రచనలల్లో గమనించవచ్చు. ఆయన చెప్పినట్లు హాస్యరస ప్రీతి, వ్యంగ్య ధోరణి మెండు. మాత్రాఛందస్సులో నడిచే 'రాములమ్మ పదాలు' లో ప్రతి చరణంలో పదేసి మాత్రల వినియోగం జరిగింది. దరహాసం, ధర హాసం అని ప్రయోగించిన తీరులో వీరి శబ్దాధికారం, శబ్దాలంకార ప్రీతి ద్యోతకమవుతుంది. శబ్ద వృత్తులను బట్టి, వాచ్యంగా చెప్పిన సందర్భాలతో పాటు వ్యంగ్యంగా/ధ్వనిపూర్వకంగా రచించిన కవితలనూ చూస్తాము. అలాగే నవరసాల్లో ప్రధానంగా హాస్యము, కరుణము, శృంగార రసములు సహృదయ పాఠక హృదయాల పై ఆవిష్కరింపబడగలవు. శబ్ద ప్రీతి, శబ్దాధికారము,

శబ్దక్రీడ - లను ఆద్యంతమూ పరికించవచ్చు.

ఈయన రచనా పాటవానికి, శైలీ విన్యాసానికి, ప్రబోధకత/ సందేశాత్మకత - లకు మచ్చుతునకలుగా "రాములమ్మ పదాలు" లోని కవితలను పరిశీలిద్దాం.

“విలువైన రత్నమ్ము /గురువర్యు పాదమ్ము" - అని గురుపాద గురుత్వాన్ని ఎత్తి చూపాడు. ప్రజాకవి గోరేటి వెంకన్న గారి కవిత్వానికి ముగ్ధుడై "తేనెలూరెడు ఊట/గోరేటి నీ పాట" అని కళ్ళకద్దుకున్నాడు. మత దురహంకారాన్ని ఖండిస్తూ, “మతములన్నవి గతము/సమత, మామతలె ఘనము " అని వెల్లడించాడు. స్నేహం గొప్పతనాన్ని వర్ణిస్తూ, “మధురామృతము, అమరత్వము కన్న గొప్పద"ని చాటాడు. “ తెలంగాణ పాట"ను "తేనెలొలికే దేశి పదాల" కోటగా ఎత్తాడు. పాల్కురికి సోమన దేశి పదములను తన కవిత్వంలో పలికించిన వైనాన్ని శ్లాఘించాడు.

"ధన్యులు ఆడవారు" అని మహిళా పక్షపాతి అనిపించుకున్నాడు. "కోమలిని చూసి జాబిలి చిన్నబోయింది" అని అతిశయోక్తితో సహజ సుందరంగా వర్ణించాడు.

“కందము రాసే వాడే కవి" - అన్న ప్రసిద్ధోక్తిని తలపిస్తూ - రాములమ్మ సరళ సహజ సుందర సౌకుమార్యాన్ని, కంద పద్య కాఠిన్యత కన్నా ఉత్తమమైనదిగా పోల్చడమూ ప్రశంసనీయము. మానవ సేవ, మాధవ సేవ కన్నా గొప్పదనే సందేశం "నిదురోయెను దేవుడు" లో వ్యక్తమైంది.

ఇక నానీల ప్రస్తావనకు వస్తే....

'నవ్వడం, నవ్వులాట కాదు. యువతుల నవ్వులు ఎన్ని హృదయాలను నలిపివేస్తాయో' అని అనుభవపూర్వకంగా కాకపోయినా అట్టి వయో స్థితిలో ఉండుట మూలాన పరకాయ ప్రవేశం చేసి చెప్పి ఉండవచ్చు.

భార్య, అమ్మ - ల ప్రేమ ఔన్నత్యం ఒక దానితో నొకటి పోటీ పడేలా ఉండాలి. కాని 'ఒకదానినొకటి అడ్డుకోరా'దనే భావన ఆమోఘం.

ఛందస్సు పైకి కఠినంగా తోచినా దాని ఫలితంగా వెల్లివిరిసిన పద్య కుసుమాలెంత గొప్ప సుందర, సుగంధ భరితాలో తెలియజేశాడు.

మట్టిని నేరుగా మనం తినలేకపోవచ్చు. కాని ఆ మట్టి పెట్టిన భిక్షనే మనమంతా ఆహారంగా తీసుకుని జీవిస్తున్నామన్న సత్యాన్ని మరొకసారి లోకానికి తెలియజేశాడు.

అందమనేది ఎక్కడో లేదు. ఆనందమే దాని స్థావరమని అనుభవించమంటున్నాడు. ఇంకా,తల్లి ప్రేమ ముందు సముద్రమూ, యావత్ జగత్తు కూడా దిగదుడుపేనని తేల్చాడు.

నిజాం రాజులు పోయినా వారి తాలూకు బూజులు మాత్రం పోలేదని

నర్మగర్భంగా హెచ్చరించాడు.

'ధర హాసం' - అంటే 'నేలనవ్వు'. దానితోనే మనందరి పెదవులపై చిరునవ్వు ముడిపడి ఉండటాన్ని గుర్తు చేశాడు.

ప్రేయసి అలుగుట వలననే కాబోలు చుట్టూతా ఉన్న వాతావరణమంతా ఏదోలా మారిపోయిందనే కల్పనాదృశ్యాన్ని కళ్ళకు కట్టాడు.

పంట పొలాలు, ప్లాట్లయి మన ప్లేట్లలో అన్నం పెట్టని దుస్థితికి రావడాన్ని గర్హించాడు.

ఇంకా "కడుపు నింపుకోడానికి కాదు... కడుపు నింపడానికి వ్యవసాయం" అని వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరించిన రైతుల నిస్వార్థ బుద్ధిని, దానశీలతను కొనియాడాడు.

మచ్చుకు కొన్నింటిని మాత్రమే ప్రస్తావించడమైనది. అన్ని కవితలూ ప్రశంసించదగ్గవే. పాఠకులు తమ స్వీయానుభవంతో గ్రహించగలరని తలుస్తున్నాను.

చిII నర్సింహా రెడ్డి యువకుడిగా తన విద్యార్థి దశలోనే ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రఖ్యాతి వహించిన కూనలమ్మ పదాల సరళిలో "రాములమ్మ పదాలు" మరియు ఉధృతలూగిస్తున్న 'నానీల'ను ప్రయోగాత్మకంగాను, ప్రయోజనాత్మకంగాను రచించి లోకార్పణ గావించడం అభినందనీయం! 'సాహిత్యమ్' అంటేనే హితముతో కూడినదని అర్థం. కనుక సమాజ హితన్ని కోరుతూ, చైతన్య పూరితమైన రచనలను వివిధ ప్రక్రియలలో వెలువరించగలడనే విశ్వాసంతో, అందుకు తగిన శక్తి సామర్థ్యాలు కలుగాలని ఆశిస్తూ మున్ముందు అగ్రశ్రేణి కవుల సరసన నిలువాలని ఆశీర్వదిస్తున్నాను.

తన ఈ రచనను పరిశీలించి, అవసరమైన చోట్ల సవరణలు చేయడమే గాక నా అభిప్రాయాన్ని తెలిపేందుకు అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞతాభినందనలు!

రాములమ్మ పదాల అంతరార్థాన్ని పాఠకులకు సులభతరం చేయుటకు కుమారి హైందవి రేఖా చిత్రాలు తోడ్పడుతాయనడంలో సందేహం లేదు. ఆమెకు నా అభినందనలు!

**బుధజన విధేయుడు**

**శ్రీ కళ్యాణ్ కర్ బుద్ధోజి చౌదరి**

విశ్రాంత అధ్యాపకుడు (తెలుగు విభాగం),

ప్రభుత్వ ఉన్నత విద్యాధ్యయన సంస్థ, మాసబ్ ట్యాంక్, హైదరాబాద్.

చరవాణి : 9885461034

# నా మాట

ఆరుద్ర గారి కూనలమ్మ పదాలు మొదటిసారి చదివినప్పుడు అందలి ఛందస్సు నన్ను బాగా ఆకర్షించింది. మొదట కొన్ని పదాలు హాస్య, వ్యంగ్య ప్రధానంగా రాశాను. తరువాత సమకాలీన అంశాల మీద రాశాను. "ప్రస్తుతం జరిగే ప్రముఖమైన అంశాల మీద కాస్తైనా స్పందించని కవిత్వం కవిత్వమే కాదు" అని నా అభిప్రాయం. కొన్ని రాములమ్మ పదాలు కానీ నానీలు కానీ ముఖ్యమైన సమకాలీన సామాజిక అంశాల మీద అవగాహన ఉంటే తప్ప అర్థం కావు. అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని సృష్టించడంలో వీటి ఛందస్సు చాలా శక్తివంతమైంది.

నేను రాయడం ఆపిన ప్రతిసారి నా మిత్రులు, శ్రేయోభిలాషుల ప్రోత్సాహం రాములమ్మ పదాలు 100వ మైలురాయిని చేరేలా చేసింది. కూనలమ్మ పదాలలో అత్యద్భుతమైన విరుపు ఉంటుంది. అదే విరుపు రాములమ్మ పదాలలోనూ ఉంటుంది. ప్రతి పాదానికి 3+4+3 క్రమంలో పది మాత్రలు వస్తాయి. అయితే కొన్ని పాదాలలో ఆ క్రమం ఉండకపోవచ్చు. మొత్తంగా ప్రతి పాదం 10 మాత్రలతో కూడుకొని ఉంటుంది. రాములమ్మ పదాలు రాయడం పూర్తి అయిన తరువాత ఏదో వెలితిగా అనిపించింది. తన అద్భుతమైన రేఖా చిత్రాల ద్వారా కుమారి హైందవి గారు ఆ వెలితిని తీర్చారు. ఇతర పనులు ఉన్నా గాని సమయం వెచ్చించి ప్రతి పదాన్ని, దాని అర్థపరిధిని అర్థం చేసుకొని వర్ణనాతీత రేఖా చిత్రాలు గీశారు. అందుకు కృతజ్ఞతాంజలులు.

ఇక నానీల విషయానికి వస్తే, ఇవి ఛందోబద్ధమైనవి గాక భావ ప్రధానంగా ఉంటాయి. డాII ఎన్. గోపి గారి నానీలు చదువుతున్నపుడు ఇంకా ఇంకా చదవాలన్న ఆసక్తి కలిగింది. "ఆ ఆసక్తే నా చేత నానీలు రాయించింది" అని చెప్పడంలో ఏ మాత్రం సంశయం లేదు. ఛందస్సు ఏమీ లేకపోవడం చేత నానీలు రాయడం చాలా సులభం అని చాలా మంది అభిప్రాయం. కానీ, నానీల నిర్మాణం సరిగ్గా అర్థం చేసుకుంటే తప్ప అసలైన నానీలను రాయలేం. ఒక్కసారి అవగతమయితే ఉప్పెనలా పుట్టుకొస్తాయి.

ఈ పుస్తకము (జత) రాయడం వెనుక చాలా మంది ప్రోత్సాహం ఉంది. నన్ను ప్రోత్సహించిన ప్రతి ఒక్కరికీ నేను ఋణపడి ఉంటాను. ముఖ్యంగా డైట్, హైదరాబాదు లో చదివేటప్పుడు నాకు నా స్నేహితుల నుంచి, అధ్యాపకుల నుంచి లభించిన ప్రోత్సాహం మరువలేనిది.

నాకోసం విలువైన సమయాన్ని వెచ్చించి, ప్రతి అక్షరాన్ని చదివి తప్పు, ఒప్పులను సరిచూసినందుకు గురువు గారు శ్రీ కళ్యాణ్ కర్ బుద్ధోజి చౌదరి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ఆయన మంచి కవి, ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు. అంతకు మించి గొప్ప మానవతావాది. అలాంటి వ్యక్తి "నానీలు, రాములమ్మ పదాలు చాలా బాగున్నాయి" అని చెప్పడం నాకు ఆనందాన్నే గాక మున్ముందు మరిన్ని రచనలు చేసేందుకు ప్రోత్సాహాన్ని ఇచ్చింది. కళాశాలలో పంచిన జ్ఞానానికి, ఈ పుస్తకం ప్రూఫ్ రీడింగ్ చేసినందుకు, విశ్లేషణాత్మక ముందుమాట రాసినందుకు ఆయనకు కృతజ్ఞతాభివందనాలు.

రాములమ్మ పదాలు దాదాపు మూడేళ్ళ కింద రాశాను. నానీలు మాత్రం ఈ మధ్య రాసినవే. "రాములమ్మ పదాలు, నానీల"ను జత చేసి "జత"గా, పుస్తక రూపంలో, మీ ముందుకు తీసుకు రావడం సంతోషంగా ఉంది. పాఠకులు సహృదయంతో ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను. సహృదయంతో చేసే విమర్శలను, ఇచ్చే సలహాలను, సూచనలను గౌరవిస్తాను, స్వీకరిస్తాను.

అడిగిన దాని కంటే అన్నీ ఎక్కువే ఇచ్చిన అమ్మానాన్న(స్వరూప, మోహన్ రెడ్డి) లకు పాదాభివందనాలతో ..

**హైదరాబాద్ ,**

**ఫిబ్రవరి, 2021**

***- పట్లూరి నర్సింహా రెడ్డి***

# అంకితం



## శ్రీ పట్లోల వేణుగోపాల్ రెడ్డి

సాహిత్య అధ్యయనానికి, రచనలు చేయడానికి
అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ ప్రోత్సహించే
మామకు ప్రేమతో ...

ఇచ్చినానను నొకడు
తెచ్చినానను నొకడు
అమర వీరులు  ఎవరు?
ఓ రాములమ్మ!

చెలియ ఎంగిలి ఫలము
అమిత మాధుర్యమ్మ
పరులదైతే జ్వరము
ఓ రాములమ్మ!

కోప మొచ్చిన మనకు
కోప మొచ్చిన తనకు
మనకె చివాట్లు తుదకు
ఓ రాములమ్మ!




ప్రజాస్వామ్యము ఖాట
కట్టి పాడెడు పాట
ప్రజల గుండెలో తూట
ఓ రాములమ్మ!

పద్య ఆధిక్యమ్ము
నడ్డి విరిచిన దమ్ము
గురజాడదే పొమ్ము
ఓ రాములమ్మ!

చెప్పిందంత వినును
చేద్దాం తప్పకనును
తలదులుపుకు తరలును
ఓ రాములమ్మ!

ఆఫ్ఘన్ల తలకోత
సారాఘరీ గాథ
చదలు మేసిన చరిత
ఓ రాములమ్మ!




ఆలు మగల తగాద
నడుమ పోవు గాడిద
చివరకవును బూడిద
ఓ రాములమ్మ!

విలువైన రత్నమ్ము
గురువర్యు పాదమ్ము
నకగునా తుల్యమ్ము
ఓ రాములమ్మ!

చేదైన ఈ నేడు
తీపి గవ్వను చూడు
నిరుత్సాహము వీడు
ఓ రాములమ్మ

పెరిగి పెట్రోల్ రేట్లు
పొడిచె పర్సుకు తూట్లు
మధ్యతరగతి పాట్లు
ఓ రాములమ్మ!




అతిగ పొగిడిన తప్పు
పొగడ కుండిన ముప్పు
సెలవి డేమిటొ ఒప్పు?
ఓ రాములమ్మ!

ఆకలయ్యిన తాను
జింక చాలని అనును
మితకాంక్షి సల్మాను
ఓ రాములమ్మ!

కలము చచ్చెను నేడు
ప్రభుత మెచ్చెను చూడు
దేశమున కిది కీడు
ఓ రాములమ్మ!

ప్రజలు మెచ్చని నేత
పదవి కెక్కెను వింత
ప్రజాస్వామ్యము చెంత
ఓ రాములమ్మ!



ప్రగతి గోరెడి నేల
అసత్య నమ్మకాల
నీట మునుగుట ఏల?
ఓ రాములమ్మ!

నమ్మించి నమ్మించి
నడి సంద్రమున ముంచి
నోడికగునా మంచి
ఓ రాములమ్మ!

గది దాట నీరాజు
ఎందుకో ఈరోజు
ప్రజల మధ్యన ఫోజు
ఓ రాములమ్మ!

కోయిలై నా బాల
కూయగా ఈ వేళ
మది ఊగు నుయ్యాల
ఓ రాములమ్మ!



అందమైన పదాల
పద్యాల పూమాల
నీకోసమే బాల
ఓ రాములమ్మ!

తెలంగాణము చోట
తేనె లూరెడు ఊట
గోరేటి నీ పాట
ఓ రాములమ్మ!

అగ్ర దేశము వారి
అధిపత్యపు పోరు
సిరియ రక్తపు టేరు
ఓ రాములమ్మ!

ఎరుపు నతివాదమని
కాషాయం శాంతని
కూర్చిరెలా లెనిన్ ని?
ఓ రాములమ్మ!



తప్ప తాగిన కిక్కు
తూగుతూ బైకెక్కు
ఆపై వాడి లక్కు
ఓ రాములమ్మ!

ఓయు కేగజాలడు
ప్రధాని నౌతంటడు
మాటల మాయగాడు
ఓ రాములమ్మ!

రోహింగ్యాల బాధ
గుండె కోసిన గాథ
ఆధునిక నరమేధ
ఓ రాములమ్మ!

జపించిన మంత్రాలు
రాలవు పూలు, పండ్లు
వంచాలయా ఒళ్ళు
ఓ రాములమ్మ!




యువరక్త తురంగం
విజ్ఞాన తరంగం
భగత్ త్యాగ మమరం
ఓ రాములమ్మ

పుట్టుక జత వచ్చెడు
మనతోడై చచ్చెడు
వాడు లేడు ఒక్కడు
ఓ రాములమ్మ!

ఒక దినము వయ్యారి
మరు దినమె గయ్యాళి
తాళి కట్టిన ఆళి
ఓ రాములమ్మ!

సగము చదివెడు వారు
సగము తెలిపెడు వారు
ఎందులో పనికిరారు
ఓ రాములమ్మ!



మనసు తెల్లని పూల
గుత్తి వంటిదె బాల
చేయ బూనకు మైల
ఓ రాములమ్మ!

డెమోక్రసి సామ్రాట్లు
ప్రజ పేల్చు బుల్లెట్లు
పంచవర్షపు ఓట్లు
ఓ రాములమ్మ!

కాలు తెగిన గానీ
కదలక ఆగిపోని
వాడికే విజయమణి
ఓ రాములమ్మ!

మతము లన్నవి గతము
మానవతకు వ్రణము
సమత, మమతలె ఘనము
ఓ రాములమ్మ!



ఇసుక దిబ్బలెడారి
తగిలి పాద మొకపరి
పూయునే సుకుమారి
ఓ రాములమ్మ!

నవత నెరుగని యువత
సమత నెరుగని ప్రభుత
ఉత్త పుత్తడి పోత
ఓ రాములమ్మ!

బడుల తలుపులు మూసి
బ్రాంది మూతలు తీసి
ప్రగతనును తలమాసి
ఓ రాములమ్మ!

భావ సంఘర్షణల
నడుమ వెలుగు జ్వాల
రచన కాత్మ వ్వాల
ఓ రాములమ్మ!




కార్మిక జనుల కొరకు
వదిలన్ని కడవరకు
నిలిచె కారల్ మార్క్స
ఓ రాములమ్మ!

జనం చూపును భక్తి
కోరి పాప విముక్తి
కలుగుతుందని ముక్తి
ఓ రాములమ్మ!

ప్రేమను దోమ కుట్టి
రోగము సోకినట్టి
వాడి గతియిక మట్టి
ఓ రాములమ్మ!

తన రూపొక చొప్పిక
దాదాపుగ గోపిక
పొగిడెద చెలి నలయక
ఓ రాములమ్మ!



మధురామృతము కన్న
అమరత్వమున కన్న
స్నేహంబుపే మిన్న
ఓ రాములమ్మ!

పిడికిలెత్తిన నేల
నెత్తురొడ్డిన నేల
కూలబడె నియ్యాల
ఓ రాములమ్మ!

ఉత్తమ విద్యార్థులు
లోలోపల కోతులు
పైకి పాడు నీతులు
ఓ రాములమ్మ!

కను చూపులే గొలుసు
చేసి కట్టుట తెలుసు
అతివ లెరిగిన సైన్సు
ఓ రాములమ్మ!




రాయి రప్పల పూజ
చేయు భక్తితో ప్రజ
మనిషొ పగిలిన కూజ
ఓ రాములమ్మ!

దేశి పదముల బాట
తెలుగు తేనియ ఊట
తెలంగాణము పాట
ఓ రాములమ్మ!

పనికి రాని బండలు
తగిలి శిల్పి చేతులు
పలుకెన్నొ భావాలు
ఓ రాములమ్మ!

కనులకు కానరాని
దీనజన బాధల్ని
కాంచువాడెవో కవి
ఓ రాములమ్మ!



నీళ్ళ నిండిన కడువ
నెత్తుకున్నొక మగువ
కోసె మనసొక తడవ
ఓ రాములమ్మ!

ముసుగు కప్పిన ముఖము
వాకిటె వేశ్యరికము
నేటి రాజకీయము
ఓ రాములమ్మ!

వసతి గృహముల నుండు
తిండి కష్టము మెండు
స్మృతులందు థౌజెండు
ఓ రాములమ్మ!

ఈత రానొక కాకి
ప్రేమ బావిలొ దూకి
నిండ మునిగె చివరికి
ఓ రాములమ్మ!



ఇచ్చి రోజా పూలు
తిప్పి షాపింగ్ మాలు
తుదకు ఏప్రిల్ ఫూలు
ఓ రాములమ్మ!

చిన్ని పదముల తోటి
వేల ఎదలను మీటు
రాములమ్మయె మేటి
ఓ రాములమ్మ!

తనది కాని విషయము
వేలు పెట్టును నిజము
ఇది యూఎస్ నైజము
ఓ రాములమ్మ!

నాకు శత్రువు నీకు
మిత్రుడని అనబోకు
అది యాంటి కాట్సాకు
ఓ రాములమ్మ!




ఎన్నికల హామీలు
అనెడు తీయని పాలు
తుదకవు నేల పాలు
ఓ రాములమ్మ!

కాలుతుందని నిప్పు
ముట్టుకొని మరిచెప్పు
వాడో సుద్దపప్పు
ఓ రాములమ్మ!




రాను రానని అనిన
కాదు రావాలనిన
మేలు కాలు విరిగిన
ఓ రాములమ్మ!

మందు తాగీ తాగి
మత్తు దిగువర కూగి
లేచి అముల్ బేబీ
ఓ రాములమ్మ!



దేశి పదముల తోన
తేట తెలుంగు వీణ
పలికించెను సోమన
ఓ రాములమ్మ

మనకొచ్చిన రోగము
మరొకని కది భోగము
చచ్చె ప్రజారోగ్యము
ఓ రాములమ్మ!

వచ్చినచొ ఎన్నికలు
రచ్చలో నాయకులు
కడు నిరాడంబరులు
ఓ రాములమ్మ!

అమలుకు సాధ్యమవని
హామీ పతంగులని
ఎగురవేయుట హాని
ఓ రాములమ్మ!



ఎండి పోయిన నేల
తుమ్ము జల్లుల వాన
రాష్ట్ర సమితి పాలన
ఓ రాములమ్మ!

ఖాళీ తలమున గడ్డి
మేయు గేదొక గుడ్డి
పైగా తనో ఎడ్డి
ఓ రాములమ్మ!



మోగి సెన్నిక గంట
బయట కొచ్చే నంట
దొంగ మంత్రుల ముఠా
ఓ రాములమ్మ!

పూర్తి అంధుడు ఐన
ప్రేమలో మునిగున్న
వారికన్నా మిన్న
ఓ రాములమ్మ!



పంట కొచ్చిన ముప్పు
తొలిగించినచొ ఒప్పు
తగలబెట్టిన తప్పు
ఓ రాములమ్మ!

కొన్ని పదముల బారు
పేర్చ గలిగిన వారు
మహాకవులైపోరు
ఓ రాములమ్మ!

మనము సచ్చే దినము
వచ్చె నదిగో నిజము
రాదు అచ్చే దినము
ఓ రాములమ్మ!

నిప్పు కక్కుకుంటూ
ఎగురు మన రాకెట్టు
ప్రగతను తేనెపట్టు
ఓ రాములమ్మ!



దిగి వచ్చి ఒకమెట్టు
మన తోటి జతకట్టు
ఓట్లకై కనికట్టు
ఓ రాములమ్మ!

అందరికి రాతల్లో
కొందరికె చేతల్లో
న్యాయం సమాధిలో
ఓ రాములమ్మ!

తమరి కొరకని వారు
ఏమీ కోరుకొనరు
ధన్యులు ఆడువారు
ఓ రాములమ్మ!

కార్పొరేటు చేతులు
తగిలి పచ్చ పొలములు
అయ్యె నిప్పు కొలుములు
ఓ రాములమ్మ!





ప్రజలు పైసా కొరకు
ఓట్లు అమ్మెడు వరకు
మార్పు దొరకని సరుకు
ఓ రాములమ్మ!

కార్పోరేటు వశము
అయ్యె విద్య స్తరము
లేదు పేదకు తలము
ఓ రాములమ్మ!



దేశ ప్రజల సమిష్టి
చేకూర్చు పరిపుష్టి
లేకున్నచో ముష్టి
ఓ రాములమ్మ!

చూడు చూడు కోమలి
చూసి నిన్ను జాబిలి
చిన్న బోయింది మరి
ఓ రాములమ్మ!



ప్రజల చుట్టూ చుట్లు
వేసి కోరును ఓట్లు
దిగరెట్లు గదిమెట్లు?
ఓ రాములమ్మ!

పేలి నమ్మిన వాడు
ఆళి నమ్మిన వాడు
కాలయమునికి ప్రియుడు
ఓ రాములమ్మ!




మంచి చెప్పెడు వారు
కోట్ల మందున్నారు
లేరు చేసెడు వారు
ఓ రాములమ్మ!

రాయువాడి మదిలో
మెదులు కమ్మని కథలొ
చెదలు జొచ్చె మధ్యలొ
ఓ రాములమ్మ!




పాత సినిమా కథలు
కొత్త పేర్లతొ వదులు
విధ మనేక స్కీమ్లు
ఓ రాములమ్మ!

సామ్యవాద గీతులు
పెట్టుబడికి గోతులు
శ్రీశ్రీ కవిత్వాలు
ఓ రాములమ్మ!

కళ్ళను జూసె వారు
క్వీను అనుకున్నారు
ముసుగు దీయ పరారు
ఓ రాములమ్మ!

కొన్ని పదముల నేరి
పేర్చి కవితను వారి
బుద్ధి కిదే నివాళి
ఓ రాములమ్మ!



చదువును పుస్తకాలు
పలుకును వాస్తవాలు
పోయు పుట్టలో పాలు
ఓ రాములమ్మ!

రాలిపడె జీవాలు
కూలిపడె దేశాలు
ప్రగతి కొరోన పాలు
ఓ రాములమ్మ!

సభల నామం ప్రగతి
ఇంటి పేరూ ప్రగతి
కానరాదేం ప్రగతి?
ఓ రాములమ్మ!

అణుబాంబులేం లేవు
యుద్ధాలు రాలేవు
చూపు మేరలో చావు
ఓ రాములమ్మ!




అసలు సిసలు రణమ్ము
ఎన్నికలే నిజమ్ము
చూపుము వేలి దమ్ము
ఓ రాములమ్మ!

కంద పద్యము నున్న
కఠిన ఛందము కన్న
రాములమ్మే మిన్న
ఓ రాములమ్మ!

కథలో అసురుల కన్న
నార్తు కొరియ నున్న
కిమ్ క్రూరుడని విన్న
ఓ రాములమ్మ!

నిదురోయెను దేవుడు
పిలిచి చూడు పలుకడు
మనిషి మనిషే తోడు
ఓ రాములమ్మ!




దేశ రక్షణ వెనుక
ఉన్నదెందరొ గనుక
నిలబడెను పడిపోక
ఓ రాములమ్మ!

గుంతల
రోడ్డు మీదే ప్రసవమైంది!
మునుపటి ఎమ్మెల్లే
మళ్ళీ గెలిచాడు!

చైనాది
సామ్రాజ్యవాదం..
పోటీదారులతో తగువు
దాని నైజం!

రోడ్డు మీద
ఎవరూ లేరేమిటి?
చలి పొదిగిట్లో
నగరం నిద్రపోతుంది!

సమయానికి
సమయం ఇవ్వాలి!
సాధించాలంటే
సహనం కావాలి!

నీకివ్వబడింది
కనెక్షన్ ఇవ్వని మైక్..
గొంతు గట్టిగా ఉందా
గెలుస్తావ్

అవమానం
అనర్థాలకు దారితీస్తుంది!
వర్సయిల్స్ సంధి
నిదర్శనం!

మనిషికో మాట
గొడ్డుకో దెబ్బ!
అందుకే కురుక్షేత్రం
తప్పనిసరైంది!

పుస్తకం
ఓ అనంత విశ్వం!
శోధించి తెలుసుకోవడం
పాఠకునివంతు!

నేను
పేదవాన్నని ఎప్పుడూ బాధపడలే..
సంతృప్తి
నా సంపద!

ఆకు
రాలిపోయింది!
మరో ఆకు కోసం
స్థలం సర్దుబాటు అయింది!

వాడు
ప్రాణ స్నేహితుడనుకున్నా ..
బ్యాంకు సర్వర్లా
సమయానికి హ్యాండిచ్చాడు !

అగ్నిపర్వతం
ఆ పుస్తకం
సలసల కాగే
లావా అందలి కవిత్వం!

హే మ్యాన్
యు నో వాట్? ఐ నో దట్..
ఆంగ్లంలో
తెలియకున్నా తెలుసంటే చాలు!

చరిత్ర వినేటప్పుడు
చెవిటివాళ్ళు
రాసేటప్పుడేమో
గుడ్డివాళ్ళు!

చదువుకుంటేనే
వచ్చేదా విచక్షణ?
అనుభవం దాని
మూల హేతువు!

ఆమె అందంగా
నవ్వేసిపోయింది..
నవ్వులో నలిగిన
హృదయాల సంగతి?

భార్యను
ప్రేమించడం తప్పు కాదు!
దానికి
అమ్మ అడ్డనుకోవడమే తప్పు!

మహానగరం
నదైపోయింది..
నడుస్తుంది
వర్షాకాలం మరి!

కుండ నిండి
నీరు దొర్లిపోయింది!
అతి
నష్టాన్నే మిగిలిస్తుంది!

ఛందస్సు
కఠినంగా ఉంటుంది..
అందుకేనేమో
పద్యాలంతందంగా ఉంటాయి!

పేదరికం
కలలపై నీళ్ళు చల్లింది!
చదువు
రెక్కలు తొడిగింది!

తొలిప్రేమ
జ్ఞాపకాలు!
అమృతంలో తడిసిన
అనుభూతులు!

ఖాళీ కుండకు
విలువ లేదు!
లోన విలువైనదేదో
ఉంటే తప్ప..

కాలం చేసిన
గాయం అది..
ఒంటరితనమా
కారం పూయకు !

మట్టిని
ఏ మనిషీ తినలేడు!
కానీ
ఆహారానికి అది అక్షయపాత్ర!

ఏ చేయి గీసిన
చిత్రమో అది?
కాగితంపై కవిత్వం
మూగబోయింది!

ఆశాదీపాన్ని
ఆరనివ్వకు..
ఆశ
జీవనవాహన ఇంధనం!

గోళ్లలో
మట్టి తీయకు!
సమస్యకు
శాశ్వత పరిష్కారం వెతుకు!

తాను
నోరు విప్పి మాట్లాడడు..
తన కలమే
తన గళము!

అగోచర పవనం
ఊపిరైంది
అగోచరమై ప్రేయసి
ఊపిరి తీసింది!

వీధి దీపంలా
కింది చూపుతో ఉండు
నీ కింది వారికది
ముందుచూపౌతుంది!

ప్రతిరోజూ
ఓ కొత్త ఉదయం!
కొత్త ఉదయం
ఓ కొత్త జీవితం!

అందంలో
ఆనందం ఉండదు!
ఆనందమే
అత్యంత అందమైనది!

నవ్వటం
కష్టమైన పనేం కాదు!
చిన్న విషయాలే
చాలా గొప్పవి!

తల్లి ప్రేమ ముందు
సంద్రం సిన్నదైపోయె
కాదా మరి
అమ్మ ప్రేమ విశ్వమంత!

దెయ్యం అంటే
నాకు భయం లేదు!
వెలుగులతో
నిండిన జీవితం నాది!

నిప్పులో కాలిన
వేలు నాది..
ప్రేమంటే
నాకెప్పుడూ భయమే!

చెప్పకుండా వస్తుంది,
వెళుతుంది!
ఆకర్షణ
అందమైన భావన!

గాలి మాటలు
నేనెప్పుడూ మాట్లాడను!
కానీ
గాలితో మాట్లాడుతాను!

నువ్
మంచోడివని విన్నా..
నా కన్నా
అన్నదే జీర్ణించుకోలేకపోతున్న!

ప్రకృతి
కన్నెర్ర జేస్తుంది!
మానవ మేధస్సు
కాస్త ఒదిగుండాలి!

కోసుకుని
దాచుకున్న!
గతంవసంతంలో పూసిన
అనుభవాల పువ్వుల్ని!

బోసిపోయిన కట్టడంపై
వాలిందో కాకి..
దానిది
కళాహృదయయమ్

చైతన్యం
అనే చిగురు పుట్టకపోతే..
చెట్టు
చచ్చిందనేగా అర్థం!

మనిషి
చాలా బలవంతుడు..
హృదయభారాన్ని
ఒక్కసారైనా మోసుంటాడుగా!

రంగులు
పూయకు భూమికి..
పచ్చదనమే
దానికి అందం!

కొలుద్దామని
కన్నీళ్లను తక్కెట్లో వేసా..
తూనీకకేంవాడాలో
తెలియలే..

అన్నింట్లోనూ
బహు పార్శ్వాలు..
దానికి
మనిషేమీ అతీతం కాదు!

కలల దుప్పటి
కప్పుకుని పడుకున్న..
నిజం
నిద్రలేపనే లేదు!

చరవాణి లేనిదే
ఏమీ తోచదు..
మనసంతా
మెమొరీ కార్డులో నిక్షిప్తం!

పాపాయికీ
కావాలట రూపాయి!
పాపి,
నువ్ పిల్లల్నీ వదల్లేదు కదూ!

ముందు
ముందు నిలబడ్డం నేర్చుకో..
ధైర్యం
అదే అలవడుతుంది!

ఒక్కాకు కత్తిరిస్తే
చెట్టు చచ్చిపోదు..
ఒంటి కాలిపై
ఆధారం ప్రమాదం!

బంధం
ముడివేసిన దారం!
మనస్పర్థలు
విడదీసే కత్తెర్లు!

పూల కన్నా
నాకు పుస్తకాలిష్టం!
అక్షరాల పరిమళానికి
నే దాసోహం!

ఏ వూరు కేగినా
ఎందుకాలిడినా..
ఇంటర్నెట్ వస్తుందో లేదో
చూస్కోవాలి!

కొమ్మకొమ్మపై
కోయిల..
కానీ ఆ చెట్టుపై
పాట పుట్టనే లేదు!

ఎప్పుడూ వాడిపోని పువ్వు
నవ్వు!
ఆహా! అద్భుతం హాహాహా
సంగీతం!

మతమూ గతమూ
రెండూ పాతవే..
ఏం లాభం
పాత గోతులు తవ్వి?

సాంకేతిక వస్తువులకు
బానిసైపోతున్నాం..
నియంత్రణ తప్పితే
ప్రమాదం!

బాధ్యత
శిలువ భారం అయిందా?
ఓర్చుకో
ఫలితం అమృతతుల్యం!

నింగి కన్ను
నిశిబొట్టు కార్చింది!
అదే నింగిన
ఉదయమూ ఉన్నది!

కడుపు
నింపుకోడానికి కాదు..
కడుపు
నింపడానికి వ్యవసాయం!

మహాబలుడు సైతం
మోయలేడు..
అపనింద
అవనంత  భారం మరి!

జీవితం
చివరి మైలురాయి మరణం!
ముందలి
ప్రతీ మజిలీ ఓ పాఠం!

కడుపు కాకలేస్తే
చేతి కేంటట?
కలిపి మరీ
నోట్లో పెడుతుంది!

హృదయం
తపించి పోతుంది!
ఎందుకో మరి
కంటికి అంత బాధ?

రైతు కంటి నుండి
కన్నీరు కారింది!
చెరపడానికి
చినుకు రాలింది!

ఎంత రాజసం
ఆ నడకలో..
పసుల మందకు
తానే రాజు మరి!

నిజాం
గడీ కూల్చేశాం అనుకున్నాం..
కొందరి రూపంలో
ఇంకా బ్రతికే ఉన్నాడు!

పశునియంత్రణకు
ముక్కుతాడు!
మా భవిష్యత్తు నాశనానికి
పెళ్లితాడు!

మా కన్నీళ్లతో
సముద్రాలు నిండాయి!
మా కోపానికి
ఆవిరైపోతాయి!

నిజంగా
మనందరి దరహాసం
ధర హాసంలోనే
దాగుంది!

ఆశ అమృతమై
కురిసింది!
ఆమె
ఆరని జ్యోతై నిలిచింది!

ప్రేమ'లో
రెండక్షరాలు..
ఎందుకంటే
అమ్మ, నాన్న'ల్లోనూ రెండక్షరాలే!

పాపం
సాఫ్ట్వేర్ ఉద్యోగులు!
సంకెళ్ళు లేని
బానిసలు!

మేం
అల్పసంతోషులం..
టీ తాగితే
అమృతం తాగినంత ఆనందం!

విష మొక్కలు
పెరిగిపోతున్నాయి!
ఉద్యోగాలకో?
ఊపిరి తీయడానికో?

ఆమె
ఇంకా చావలేదు!
ఎందుకంటే, ఆమె
నాటిన మొక్క బతికే ఉంది!

చెడ్డ వాళ్ళతో
తిరగకూడదు!
పడగ నీడన
పవళించకూడదు!

ఎవరు
భూమ్యాకాశాలు వేరన్నారు?
చినుకులతో
కలుస్తూనే ఉన్నాయిగా..

ఉన్నతంగా
ఎలా ఎదగాలి?
మొక్కయిన
విత్తనాన్ని అడుగు!

అమ్మ అంటే
తెలీదట పిల్లాడికి..
వెళ్ళి
గూగుల్ నడిగాడు!

దాస్యానికి
వాడు విసిగిపోయాడు!
ఎత్తిన చేయి
కత్తికన్నా పదును!

ఆకాశంలో
ఒంటరి చుక్కనడుగు..
తోడు లేని వెలుగూ
చీకటే!

నిశ్శబ్దంగా ఉందా
శూన్యం?
మనసుతో విను
దాని మౌనగానం!

బరువున్నానని
ఎగరలేదా విమానం?
అనుకుంటే అందదా
ఆకాశం?

నెమ్మదే కానీ
నడకనాపిందా నత్త?
స్తబ్ధత
ఉనికికి ప్రమాదం!

వర్షమునకు
రెండు మార్లు
దేశభక్తికి వాట్సాప్లో
ఫార్వర్డ్ పట్టాభిషేకం!

స్వచ్ఛమైన గాలి
దుమ్మయిపోయిందా?
అంతా
మన ఘనకార్యమే!

వాతావరణం
ఒక్కసారిగా మారింది!
ప్రేయసి
అలిగిందని కాబోలు!

చెట్ల నిశ్వాస
మనకు ఉచ్ఛ్వాస!
ఏ జీవి
స్వతంత్రంగా మనలేదు!

పంట పొలాలు
ప్లాట్లయి పోతున్నాయి
ప్లాటు ప్లేటులో
అన్నం పెడుతుందా?

భయం
అంతరంగ అగ్నిపర్వతం!
పుట్టిందా
విస్ఫోటనం తప్పదు!

గంగానదికి
పూజలు చేశాం!
మురికి కాల్వలు
దాంట్లోకె వదిలేశాం!

ఇంటర్నెట్ స్పీడు
పడిపోయింది!
వేల జీవజాతు
లంతరించిపోతున్నాయి!

అందరూ
బాధ్యత గల పౌరులే..
ఓటింగ్ శాతం
ఇరవై కూడా దాటలే !

స్మార్ట్‌ఫోన్
స్క్రీను పగిలింది!
గుండె పగిలినా
బావుండు అన్పించింది!

అంతర్జాలం
అందమైన మిథ్య
స్మార్ట్‌ఫోన్
దాని ప్రవేశ ద్వారం!

ప్రశ్నించటం
చిన్నప్పటి నుండే నేర్పాలి !
ప్రశ్న అవినీతికి
అడ్డుకట్ట

దేవుణ్ణి నమ్మేడువారు
ఆస్తికులు!
నమ్మనివారు
దేశద్రోహులు?

నానీ నీ
బుడిబుడి అడుగులు
హృదయోల్లాస
పదాల చిందులు!

-సమాప్తం-